భౌతికవాద తాత్త్విక సౌధం 'చార్వాకాశ్రమాని'కి 50 ఏళ్ళు

అసాధారణ ఆలోచనాపరుడు

ముస్లిం సత్యశోధక్ మండల్ వ్యవస్థాపకుడు



# హమీద్ దల్వాయ్

(50 ఏళ్ళ నాటి అరుదైన ఇంటర్వ్యూ)

మూలం : **జీషాన్ కస్కర్**

స్వేచ్ఛానువాదం : **గౌరవ్**

**చార్వాకాశ్రమ ప్రచురణలు**

**నిడమర్రు, మంగళగిరి**

# చార్వాకాశ్రమం

* నాస్తిక, శాస్త్రీయ భావజాలం విస్తృత ప్రజానీకంలోకి వెళ్ళేందుకై ఒక సాంస్కృతికోద్యమ కేంద్రం అవసరమని గుర్తించిన రామకృష్ణగారు, మూఢనమ్మకాలను, అశాస్త్రీయ భావాలను లేత మనసుల్లోకి ఎక్కించే దుష్ట సంప్రదాయానికి భిన్నంగా ప్రత్యామ్నాయ విద్యావిధానంగల పాఠశాలను ప్రారంభించాలన్న ఆలోచన, ఆశయానికి రూపకల్పన చేస్తూ 1973 సంవత్సరంలో 'ప్రగతి విద్యావనం' పేరుతో పాఠశాలను ప్రారంభించారు.
* ప్రాచీన భారత భౌతికవాదులైన చార్వాకులు, లోకాయతుల ఆలోచనాధారను మార్క్సిజంతో మేళవించి ప్రజానుకూలమైన సంస్కృతిని నిర్మించడానికి పునాదులు వేసే పాఠశాలగా దీనిని నడిపారు.
* దేశీయ తత్త్వశాస్త్రంలో భౌతికవాదంతో కూడిన చార్వాక దర్శనాన్ని సూచిస్తూ స్కూలు పేరును 'చార్వాక విద్యా పీఠం'గా పేరు మార్చారు.
* ప్రశ్నించటం, తర్కించటం, మేధోవికాసానికి ఉపయోగపడే లక్షణాలను పిల్లల్లో ప్రోత్సాహించాలన్న లక్ష్యంతో పాఠశాల కార్యక్రమాలు రూపొందించారు.
* మాతృభాషలోనే విద్యాబోధన సాగాల్సిన ఆవశ్యకతను గుర్తించి దానిని అమలు చేశారు.
* సమాజాన్ని, సమాజ పరిణామ క్రమాన్ని ప్రస్తుత పరిస్థితులను వాటి మూలాలను తెలియజెప్పి, పిల్లల్లో భౌతికవాద పునాదిని వేయటానికి కృషి చేశారు.
* కులమతాలను అంతం చేసే వైపుగా, పీడననంతం చేసే వైపుగా విద్యార్థులతో ప్రతిజ్ఞ చేయించేవారు.
* మతప్రసక్తి, దైవప్రసక్తి లేని పాఠ్యగ్రంథాలను ప్రచురించారు.
* హోమియో, ఆయుర్వేదం, ఆక్యుపంక్చర్, అల్లోపతి, వైద్యశిబిరాలను గ్రామాలలో నిర్వహించి, భూత వైద్యులచేత మంత్రాలు పెట్టించుకోకూడదని ఆరోగ్యం పట్ల శాస్త్రీయ భావనను ప్రచారం చేశారు.
* ఆశ్రమంలో సంస్కర్తల, ప్రగతిశీలవాదుల, ప్రాచీన భౌతికవాదుల విగ్రహాలు ఆవిష్కరించారు.
* భగవద్గీతకు ప్రత్యామ్నాయంగా 'చార్వాకగీత' సంస్కృత శ్లోకాలలో రాసి, వ్యాఖ్యానంతో ఆడియో క్యాసెట్‌గా విడుదల చేశారు.
* దేశంలో అత్యవసర పరిస్థితిని ప్రకటించిన కాలంలోనూ, అంతకు ముందు కూడా చార్వాకాశ్రమం ఎందరో దేశభక్తులకు ఆశ్రయమిచ్చింది.
* మార్క్సిజాన్ని నమ్మిన వివిధ సంఘాలకు సంబంధించిన కార్యకర్తలు, నాయకులు చార్వాకాశ్రమానికి సుపరిచితులే.
* చార్వాక విద్యాపీఠంలో నాస్తిక ప్రజాసాహిత్యం ముద్రణ కొరకు ముద్రణాలయము ఏర్పాటు చేశారు. లోకాయత ప్రచురణలు, చార్వాకాశ్రమ ప్రచురణల పేరుతో ప్రచారం చేశారు.
* 'నాస్తికయుగం', 'నాస్తికత్వం', 'చార్వాకం', 'వాయిస్ ఆఫ్ చార్వాక' మొదలగు పత్రికలను ప్రచురించారు.
* 1982 సంవత్సరము నుండి చార్వాక కేలండర్ పేరుతో నాస్తిక కేలండర్ ముద్రిస్తున్నారు.
* ప్రతి సం॥ నాస్తిక అధ్యయన తరగతుల నిర్వహణ.

# అనువాదకుడి మాట

**హ**మీద్ దల్వాయి (1932–1977) స్వతంత్ర ఆలోచనాపరుడు, పాత్రికేయుడు, సంఘసంస్కర్త, రచయిత, సామాజిక ఉద్యమశీలి, విప్లవాత్మక హేతువాది, సామ్యవాది. ఇండియన్ సెక్యులర్ సొసైటీ నేత, ముస్లిం సత్యశోధక్ మండల్ స్థాపకుడు లౌకిక భారతదేశంలో ముస్లిం రాజకీయాలు (Muslim Politics in Secular India -1968) అనే గ్రంథం రాశాడు. ఆయన జీవితం కృషికి సంబంధించి 2017లో ఒక డాక్యుమెంటరీ చిత్రం కూడా రూపొందింది. ఆయన స్థాపించిన 'ముస్లిం సత్యశోధక్ మండల్' నేటికీ క్రియాశీలంగా ఉంది.

రామ్ మనోహర్ లోహియా, జయప్రకాశ్ నారాయణ్, మహాత్మాగాంధీ మొదలగు నేతల జీవితాలు, కృషితో ప్రభావితమైన హమీద్ 'ఇండియన్ సెక్యులర్ ఫోరమ్'ని ఎ.బి.షాతో కలిసి స్థాపించాడు. 'రూఫ్' (పై కప్పు), 'పది రూపాయల నోటు' వంటి కొన్ని కథలు, 'ఫ్యూయల్' (ఇంధనం) అనే నవల ప్రసిద్ధి చెందాయ్, ఎన్ని అవాంతరాలు వచ్చినా చివరి వరకూ హేతువాద మానవవాద భావాలకి కట్టుబడి జీవించిన యోధుడు. ముస్లిం సమాజంలో మార్పు కోసం, చైతన్యం కోసం ఎన్నో కష్టాల్ని, అవమానాల్ని ఎదుర్కొన్న ధీరుడు.

భౌతికవాద తాత్త్విక సౌధం, తెలుగులో భావోద్యమాల కోసం స్థాపించబడ్డ 'చార్వాకాశ్రమా'నికి 50 ఏళ్ళు పూర్తయిన సందర్భంగా (1973–2023) ఫిబ్రవరి 2024లో జరుగనున్న నాస్తికమేళాకు అతిథిగా ముస్లిం సత్యశోధక్ మండల్ అధ్యక్షులు డా॥ షంషుద్దిన్ ఎం. తంబోలి రానున్నట్లు తెల్సింది. నిజానికి చాలా కాలం నుండే హమీద్ దల్వాయి అసామాన్య వ్యక్తిత్వం గురించి నేను చదివి ఉన్నాను. ఐతే ఈ సందర్భంగా ఆయన సరిగ్గా 50 ఏళ్ళ క్రితం ఇచ్చిన విలువైన ఇంటర్వ్యూను The Wire మే 23,2023న ఆంగ్లంలో తర్జుమా చేసి ప్రచురించింది.

అదెంత గొప్పగా ఉందంటే ఏకబిగిన చదివిన నేను ఆపకుండా అప్పటికప్పుడే తెలుగు చేశాను. ప్రస్తుత సమయంలో ఇదెంత అవసరమైన ప్రయత్నమో వ్యక్తిగతంగా నాకు తెలుసు. అందుకే ఇదిలా ప్రచురించడం జరుగుతోంది. హడావిడిలో దొర్లిన అచ్చుతప్పులకు, వాక్య సమన్వయ లోపాలకు పూర్తి బాధ్యత నాదే. ఈ అవకాశం ఇచ్చిన చార్వాకాశ్రమానికి హృదయపూర్వక ధన్యవాదాలు.

– గౌరవ్

# అంకితం



భౌతికవాద తాత్త్విక విలువలకు, మానవీయ భావాలకు కట్టుబడి

ఎవర్నీ ఎన్నడూ నొప్పించకుండా అనుకోని పరిస్థితులతో పోరాడి

తన జీవితాన్ని ముగించుకున్న మౌన మృదుస్వభావి, మిత్రుడు

**'బి. చార్వాక' (1974-2023)కు**

అకళంకిత అభిమానంతో

ఈ చిరు అనువాదాన్నిలా....

– గౌరవ్

రామచంద్ర గుహ రచన 'ఆధునిక భారత నిర్మాతలు' (Makers of Modern India) ద్వారా మొదటిసారి అనేకమంది యువత కూడా 'హమీద్ దల్వాయి' పేరు విన్నారు. 'చిట్టచివరి ఆధునికుడి'గా అభివర్ణించబడిన హమీద్ దల్వాయి పాత్రికేయుడు, సంఘసంస్కర్త. త్రిపుల్ తలాక్ రద్దుకోసం ఉద్యమించిన దేశంలోనే మొదటి వ్యక్తి. దల్వాయి చనిపోయే నాటికి ఆయన వయసు 44 ఏళ్ళు మాత్రమే. ఆయన 46వ వర్ధంతి సందర్భంగా విశిష్టమయిన ఆయన భావాలపై వెలుగు ప్రసరించడం ఈ రోజు అవసరమని భావిస్తున్నాం.

ముస్లిం సమాజంలో ఉన్న మూఢాచారాలు, త్రిపుల్ తలాక్, ఉర్దూ భాషకి మతం రంగు పులమడం తదితర అంశాల గురించి హమీద్ ప్రగతిశీల మార్గంలో ఎదురు నిలిచాడు. సంఘసంస్కరణల కోసం పోరాడాడు. దురదృష్టవశాత్తూ హమీద్ ఆర్.ఎస్.ఎస్ గోల్వాల్కర్ వాదానికి వ్యతిరేకంగా ఆశించినటువంటి లౌకిక ఉమ్మడి పౌరసత్వ చట్టానికి విరుద్ధమైన చట్టాన్ని ఈ రోజు రుద్దడానికి ప్రయత్నం జరుగుతోంది. మతం ప్రాతిపదికగా విభజించి పాలించడం మతోన్మాదశక్తులు చేస్తున్నాయి.

మహారాష్ట్ర కొంకణ్ ప్రాంతంలోని చిపున్ వద్ద మిర్జోలి గ్రామానికి చెందిన హమీద్ దల్వాయి 14 ఏళ్ళ వయసులోనే అప్పటికి ఐదేళ్ళ క్రితమే స్థాపించబడిన 'రాష్ట్ర సేవా దళ్' అనే సోషలిస్టు సంఘంలో సభ్యుడయ్యాడు. అందులో ఉండగానే ప్రజాస్వామ్యం, సమాజవాదం, లౌకికవాదం, వైజ్ఞానిక వైఖరి, హేతువాదం, జాతీయత భావాలు ఆయనలో ఏర్పడ్డాయి. వాటి ఆధారంగానే హమీద్ తన భావి మార్గాన్ని మలచుకున్నాడు. సేవాదళ్ సంస్థలో అసాధారణ చైతన్యంతో తొణికిసలాడిన అతికొద్దిమంది యువ కిశోరాల్లో హమీద్ ముఖ్యుడు.

తొలినాళ్ళలో సోషలిస్టు చైతన్య ప్రవాహంగా సాగిన హమీద్ కొద్దికాలంపాటు ఆచార్య ఆత్రే పత్రిక 'మరాఠా'లో జర్నలిస్టుగా చేశాడు. అప్పుడే 'ఇంధన్' (ఇంధనం) అనే నవల రాశాడు. దిలీప్ చిత్రే దాన్ని ఇంగ్లీషులోనికి అనువదించాడు. ఐతే, సాహిత్యం కంటే సామాజిక అంశాల మీదే ఆయన ఎక్కువ దృష్టి పెట్టినట్లు కనిపిస్తుంది. ముస్లిం సమాజంలో తిష్టవేసిన బహుభార్యత్వం, బలవంతపు విడాకులు, స్త్రీల దుస్థితి పట్ల తీవ్రంగా వ్యథ చెందిన హమీద్ ఆ దిశగా ఉద్యమం చేశాడు. ఏప్రిల్ 18, 1966న అలా ఆయన ముస్లిం మహిళలతో నిర్వహించిన ఆందోళన ముఖ్యమైనది.

జోతిరావుఫూలే సత్యశోధక్ సమాజంతో ప్రభావితమైన హమీద్ 'ముస్లిం సత్యశోధక్ సమాజ్' స్థాపించాడు. ఈ మొత్తం కార్యక్రమాలన్నిట్లో ఆయన భార్య, సంఘసంస్కర్త మెహరున్నీసా దల్వాయి సహకారం ఉంది. ఆమె రాసిన స్వీయచరిత్రలో ఒక సామాజిక

కార్యకర్త జీవితం ఎంత కఠినమో చిత్రించింది. సంఘసంస్కరణ క్రమంలో హమీద్ ఎదుర్కొన్న కష్టాలు; సాంప్రదాయ ముస్లిం సమాజం నుండి వచ్చిన బెదిరింపులు కూడా ఆమె వివరించింది.

హమీద్ దల్వాయి కోసం 13 మంది రాసిన వ్యాసాల్ని క్రోడీకరించి ఆమె 'ఒక అసహన యువ లౌకికవాది' (Angry Young Secularist) అనే గ్రంథం ప్రచురించింది. 2017లో ఆమె కూడా పూనాలో మరణించింది. ఈ పుస్తకంలో 1973 నాటి ఈ అరుదయిన ఇంటర్వ్యూ ఉంది. ఆగస్టు 26, 1973లో 'మనోహర్' అనే వారపత్రికలో ప్రచురించబడిన ఈ ఇంటర్వ్యూలో హమీద్ దల్వాయి వ్యక్తీకరించిన అనేక భావాలు, రాజకీయాలు, కమ్యూనిజం, మతోన్మాదం ఇంకా అనేక అంశాలు ప్రస్తావించారు.

మరాఠీ మూలంలో నుండి జీషాన్ కస్కర్ ఆంగ్లంలోకి అనువదించిన ఆ ఇంటర్వ్యూ పూర్తిపాఠం ప్రచురించడం జరుగుతోంది, ఇక చదవండి. – **ద వైర్**

♦♦♦♦

**ప్ర :** మేధా గోల్వాల్కర్ (దాదర్) : మీ కార్యక్రమాలకీ, జనసంఘ్ కార్యక్రమాలకీ మధ్య విభేదాలు ఏమిటి?

**జ :** గోవధ నిషేధానికి నేను పూర్తిగా వ్యతిరేకం. సమాజం సమానతా సూత్రాలపై పునర్నిర్మితమవ్వాలని నేననుకుంటాను. ఆలీఘర్, బెనారస్ యూనివర్సిటీల పేర్లలోంచి 'ముస్లిం', 'హిందు' అనే పదాలు తొలగించి, వాటిని కేంద్ర విశ్వవిద్యాలయాలు చేయాలి. స్త్రీ పురుషులు ఇరువురుకీ సమానహక్కులు ఉండాలి. అందుకనే నేను ఉమ్మడి పౌరసత్వ చట్టం కోసం ఉద్యమిస్తున్నాను. ప్రతి ఒక్కరూ కచ్చితంగా కుటుంబ నియంత్రణ పాటించాలని నా భావన. అంతేకాదు, అది తప్పనిసరి కావాలి కూడా.

ఈ దేశంలో తీసుకోబడే రాజకీయ విధానపరమైన ఏ నిర్ణయం కూడా లక్షలాది ప్రజల సాంఘికార్థిక స్థితిగతులు సంక్షేమం ఆధారంగా వుండాలే కాని ఏదోక మతం/ ఆ మతస్తుల మనోభావాల ఆధారంగా ఉండరాదు. జనసంఘం యొక్క సూత్రాలు వారి ఆచరణలో నిక్షిప్తమై ఉన్నాయి. మేధాబాయి సోదరా నేను ఇందాక చెప్పిన సమాధానం మీ ప్రశ్నకి సరిపోతుందనుకుంటాను.

**ప్ర :** అశోక్ పరబ్ (జోగేశ్వరి) : కులాంతర వివాహాల గురించిన మీ అభిప్రాయాల్ని నిజాయితీగా వెల్లడించండి?

**జ :** కులాంతర వివాహాలు చేసుకోగోరే వాళ్ళందరికీ ఎటువంటి ఆటంకాలూ లేకుండా పెళ్ళి చేసుకునే స్వతంత్రం ఉండాలి. వివాహం అనేది వ్యక్తిగతం. దాంట్లో గందరగోళం అవసరంలేదు. ఇతరుల విషయాల్లో జోక్యం పనికిరాదు.

నేను వెల్లడించే భావాలన్నీ 'నిజాయితీ'గానే చెబుతున్నాను. కాబట్టి 'నిజాయితి' కలవంటూ ప్రత్యేకంగా శీర్షిక పెట్టాల్సిన పని లేదని నా భావన.

**ప్ర :** రమేష్ ఉదారే (ముంబయి) : "విగ్రహారాధకుల్ని నిర్మూలించండి" ఇలాంటి వాక్యం ఖురాన్‌లో ఉందా?

**జ :** మీరు చెప్పిన వాక్యం వంటిది ఖురాన్‌లో లేదు. కానీ విగ్రహారాధకులపై పన్ను విధించమనైతే ఉంది. జిజియా పన్నుకి మూలం ఆ వాక్యమే. (ఇస్లామిక్ చట్టాన్ని అనుసరించే జిజియా పన్ను అనేది ముస్లిమేతరుల నుండి చారిత్రకంగా వసూలు చేయబడేది.)

అసలు ప్రశ్న ఏమిటంటే ఖురాన్‌లో ఏముందో, ఏది లేదో అన్నది కాదు. ఈనాటి పరిస్థితుల్లో మనం మన మానవ సంబంధాల్ని ఎలా నిలుపుకుంటున్నాం అనేది మాత్రమే. సామాజిక న్యాయానికి, మానవ సమానతకి విరుద్ధమైన వ్యాఖ్యానాలు ప్రతి మతంలోనూ కనిపిస్తాయి. మనుస్మృతి కూడా మహిళలకు, దిగువ కులాలకు సమాన హక్కులు కల్పించలేదు. ఆధునిక భారతదేశం, నాగరిక సమాజం మనుస్మృతి ఆధారంగానో, ఖురాన్ ఆధారంగానో నిర్మించబడలేదు. భారతీయ సమాజ పురోగతి పౌరులందరి సమానత్వం మీద ఆధారపడి ఉంటుందనే విషయం హిందువులు, ముస్లిములు ఇరువురూ అర్థం చేసుకోవడం అవసరం.

**ప్ర :** ప్రకాష్ భాగవత్ (యవత్‌మాల్) : మత అల్లర్లకు ప్రధానంగా ఎవరు కారణం?

**జ :** చాలాసార్లు హిందువులు, ముస్లింలు ఇద్దరూ కారణం.

**ప్ర :** ఏ.ఆర్.కస్తూరి (గుల్టేకాడి) : భారతదేశం వెలుపల ముస్లింలకి – ముస్లిమేతరులకి మధ్య సంబంధాలు ఎలా ఉన్నాయి?

**జ :** కొన్నిచోట్ల బాగున్నాయి, మరి కొన్ని చోట్ల అంత బాగాలేవు. ఉదాహరణకి ఇండోనేషియాలో క్రైస్తవులు, బౌద్ధులు, హిందువులూ అల్ప సంఖ్యాకులు. అయినప్పటికీ అక్కడ ఎలాంటి మత కలహాలు లేవు. అలాగే, మలేషియా, లెబనాన్, టర్కీ, టునేషియా వంటి దేశాల్లో కూడా ముస్లిమేతరులు అల్పసంఖ్యాకులుగా ఉన్నప్పటికీ ప్రశాంతంగా జీవిస్తున్నారు. అరబ్బులు, యూదులు కొన్ని అరబ్ దేశాల్లో బాధలకు గురవుతున్నారు. పాకిస్తాన్లో సిక్కులు, హిందూ అల్పసంఖ్యాకుల సంఖ్యా, ప్రాతినిధ్యం తక్కువ. అలాగే, బంగ్లాదేశ్‌లో హిందువులు భద్రంగా జీవించే పరిస్థితులు కల్పించబడ్డాయి మరి.

**ప్ర :** మహదేవ్ కోకటె, చంద్రకాంత్ ధర్మాధికారి (అంధేరీ) : భారతదేశంలో ముస్లిం మతతత్వపరులు కనుక పెరిగితే, (కొత్త) నయా పాకిస్తాన్ కోసం డిమాండ్‌లు తలెత్తే అవకాశం ఉన్నదా?

**జ :** మతతత్త్వ ముస్లింల గురించి, వారి డిమాండ్ల గురించీ మీరు అంతగా భయపడాల్సిన అవసరముందని నేను భావించడం లేదు. 'మాకు భిండీ బజార్లో పాకిస్తాన్ కావాలి' అని కూడా వారు కోరవచ్చు కానీ, వాళ్ళు అడిగినంతలో అలాంటిదేదో జరుగుతుందని భావించడం అంత వివేకమని నేననుకోవడంలేదు. 'ప్రత్యేక' దేశం ఇవ్వడానికి ఇక్కడున్నది విదేశీ ప్రభుత్వం కూడా కాదు.

**ప్ర :** మొహమ్మద్ సెమి కాంట్రాక్టర్ (ఔరంగాబాద్) : మిమ్మల్ని మీరు ముస్లింగా భావిస్తారా? భావిస్తే కనుక, నమాజ్, ఉపవాసం, ఖురాన్, అంతిమ తీర్పు దినాల పట్ల మీ వైఖరి ఏమిటి?

**జ :** నేను ప్రార్థనలు, ఉపవాసాలు చేయను. మొహమ్మద్ వలనే తప్పా దేవుడి ద్వారా ఖురాన్ రూపుదాల్చిందని నేననుకోను. అంతిమ దినాల్ని ఆఖరు తీర్పుల్ని నేను నమ్మను. అయినప్పటికీ నేను ముస్లింనే. ఎందుకనంటే నేను ముస్లిం కుటుంబంలో జన్మించాను. అవిశ్వాసి అయ్యుండి కూడా నెహ్రూ ఏ విధంగా హిందువో అదే తర్కం ప్రకారం నేను కూడా ముస్లింనే. హిందువుగా, ముస్లింగా ఉండడానికి వాటికి పైపైన ఇచ్చే నిర్వచనాలను నేనంగీకరించను. అది మరింత సూక్ష్మమైన లోతైన విషయమని నా భావన.

**ప్ర :** బాల్ జింబేకర్ (వాసాయి) : మీ రాజకీయ గురువెవరు? బాల్ థాకరేలాగా మీకు కూడా అంగరక్షకులెవరయినా (బాడీగార్డ్) ఉన్నారా?

**జ :** నాకు నేనే స్వయాన రాజకీయ గురువుని. ఇక, అంగ రక్షకుల్ని పెట్టుకునేటంత డబ్బు ఎక్కడుంది?

**ప్ర :** గులాం అహ్మద్ (ఔరంగాబాద్) : కేవలం 10% ముస్లింలు మాత్రమే చదివి అర్థం చేసుకునే మరాఠిలోనే మీరు రచనలు చేయడానికి గల కారణం?

**జ :** 90% మహారాష్ట్ర ముస్లింలకి మరాఠి అర్థమవుతుంది. మిగతా 10% పట్టణ ప్రాంత ముస్లింలకి తప్పులతడకలతో ఉర్దూ వస్తుంది. మరాఠి కలగలిసి ముంబయి యాసతో కూడిన ఉర్దూ అది. దానివల్ల లక్నో మూలాలున్న వ్యక్తికి మాత్రమే మళ్ళీ ఆధిక్యత ఉంటుంది. గులాం అహ్మద్‌భాయి, నా రచనా వ్యాసాంగం ఎందుకు మరాఠిలో ఉంటుందో ఇప్పుడు మీకు అర్థమయిందా?

**ప్ర :** సుధీర్‌కుమార్ ఆచార్య (కళ్యాణ్) : ఈ రకమైన సామాజిక అభివృద్ధి కార్యాచరణలో మీ కుటుంబ మద్దతు మీకు ఉంటుందా?

**జ :** అవును, అనేక విధాలుగా ఉంటుంది. కానీ అసలు మీ దృష్టిలో 'కుటుంబం' అంటే ఏంటో తెలియాలి. చాలావరకు నా కుటుంబ బాధ్యతలు నా భార్యే పంచుకుంటుంది. ఆమె సంపాదిస్తుంది. అది కూడా మద్దతుగానే నేను భావిస్తాను.

**ప్ర :** స్వామి ప్రసాద్ పండిత్ (పింప్రి) : సృజనాత్మక రచయిత రాజకీయల్లోకి రావడంవల్ల ఎంతవరకూ రాణించగలడు? మీరూ చాలా విశిష్టమైన రచయిత, హృదయమున్న వ్యాసకారుడూ అయ్యుండీ ఈ మధ్య అలా రాయడం మానేశారా?

**జ :** రాజకీయాలెలా నాకు మేలు చేశాయో మీరే చెప్పారు. ఈ మధ్య నాకు తీరికుండటం లేదు, ఉదారంగా విరివిగా నేను రాయలేకపోతున్నాననే విషయం బాధిస్తోంది. కాబట్టి అంతే ప్రభావశీలతతో మళ్ళీ తిరిగి రాయడానికి పూనుకుంటాను.

**ప్ర :** మీనాక్షి తక్తే (పూణె): మీ కుటుంబం, అంటే మీ తల్లిదండ్రులు, భార్యాపిల్లలు మతం మీద మీకున్న ఈ అభిప్రాయాలతో ఏకీభవిస్తారా?

**జ :** వాళ్ళు అంగీకరించాల్సిన అవసరం లేదు. అలా ఒప్పుకుని తీరాలని బలవంతం కూడా నేను చేయను. వాళ్ళ భావాల్ని నా మీద రుద్దరు. ప్రతి ఒక్కరికి వారి మతాన్ని ఎంచుకునే హక్కు ఉందనేది నా నమ్మకం. ఆ విధమయిన ప్రజాస్వామిక స్వేచ్ఛ మా ఇంట్లో ఉంది. కాబట్టి మేము సుఖశాంతులతో జీవిస్తున్నాం. కావాలంటే ఈ విధానాన్ని మీరు మీ ఇంట్లో కూడా పాటించవచ్చు.

**ప్ర :** షేక్ సిరాజ్ అహ్మద్ (షంషేర్‌పూర్) : అత్యధిక శాతం ముస్లిం జనాభా గ్రామీణ ప్రాంతాల్లో ఉంటే, సత్యశోధక్ ఉద్యమం పట్టణాలకే ఎందుకు పరిమితమయ్యింది?

**జ :** ఉద్యమాలు పట్టణాల్లో జనిస్తాయి, పల్లె ప్రాంతాలకు విస్తరిస్తాయి. మా ఉద్యమం ఇప్పుడే ప్రారంభం అయ్యింది. రానురాను అభివృద్ధి అయ్యీ గ్రామీణ ప్రాంతాలకి కూడా వెళుతుంది. మీరడిగిన ప్రశ్నకి జవాబు దొరికిందనుకుంటాను.

**ప్ర :** అరుణ్ చావన్ (సతారా) : హిందువుల సహనం వలన ఇక్కడి ముస్లింలు ఆనందంగా జీవించగలుగుతున్నారు. ముస్లింలు ఐక్యంగా ఎందుకుండకూడదు?

**జ :** ఈ ప్రశ్నకి మొత్తంగా నేనో పెద్ద సిద్ధాంత గ్రంథమే రాయగలను. ముస్లిం సమాజ ఐక్యతకి ప్రధాన అవరోధం, అంతర్గత విభేదాలు, కలహాలనేదే ఈ ప్రశ్నకి క్లుప్తమైన జవాబు. అయితే, హిందూ సమాజం అధునీకరణ చెందినప్పుడు మాత్రమే ఈ కలహాలు సమసిపోతాయి.

**ప్ర :** సుధాకర్ జోషి (జమ్నేర్) : రాష్ట్రీయ స్వయం సేవక్ సంఘ్ (ఆర్.ఎస్.ఎస్) మతతత్త్వ సంస్థా?

**జ :** వారిది మతతత్త్వ విధానమనే విషయం రాష్ట్రీయ స్వయం సేవక్‌సంఘ్ అధికార ప్రతినిధులే చెబుతున్నారు. ఆ సంస్థలోని అనేకమంది నాయకుల ప్రసంగాలు, రచనల ద్వారా ఆ విషయం మీరు తెలుసుకోవచ్చు. అంతేకాదు, వాళ్ళ రాజకీయ విన్యాసాల్ని చూస్తేకూడా అది అర్థమవుతుంది.

**ప్ర :** విశ్వాస్ దిగ్గికార్ (ఉమర్గా) : రాజకీయాల్లో ఉండే 'మంచి' వ్యక్తులు ఆర్థికంగా నిలదొక్కుకోవడం అరుదయిన విషయం. అందుకే మీ బతుకు తెరువు ఏ విధంగా జరుగుతోందని అడుగుతున్నాను?

**జ :** చాలామంది సాంప్రదాయ ముస్లింలు నాకు అమెరికా రహస్య గూఢాచార సంస్థ (CIA) నుండి రష్యన్ గూడాఛార సంస్థ (KGB) నుండీ, క్రైస్తవ మిషనరీల నుండి, ఆరెస్సెస్, జనసంఘ్, ఇంకా ఇందిరాగాంధీ నుండి కూడా నిధులు అందుతాయని నమ్ముతున్నారు. మరోవైపు కొందరు హిందూత్వవాదులు, నేను పాకిస్తాన్ రహస్య గూఢాచారిననీ, యాహ్యాఖాన్, జుల్ఫికర్ అలీభుట్టో నుండి నాకు నిధులు వస్తాయనుకుంటున్నారు.

కానీ, నిజం ఏమిటంటే, 'భారత లౌకిక సంస్థ' (Indian Secular Society) కి నేను పూర్తిస్తాయి సభ్యుడ్ని. బతకడానికి కావాల్సిన జీతం నాకు వస్తుంది. అదీకాక నా భార్య కూడా ఉద్యోగం చేస్తోంది. మేము ముంబాయి నగర శివార్లలో రెండు గదులున్న ఇంట్లో ఉంటాం. మా కార్యక్రమాలకి సహకరించే దాతల వల్ల కూడా మాకు ఆర్థిక సహకారం ఉంది.

విశ్వాస్‌రావ్‌గారూ, మీకు నాపై 'విశ్వాసం' ఉందని నమ్ముతున్నాను. నా ఈ జవాబు ఆధారంగా నా భృతిని గూర్చి మీరో అభిప్రాయానికి రావచ్చు.

**ప్ర :** వెంకటేష్ లిగ్దే (ముంబయి) : ఇందిరాగాంధి ప్రభుత్వం ఉమ్మడి పౌరసత్వ చట్టం ఎందుకు చేయట్లేదు? 'ముస్లింల ఓట్ల కోసం 'షరియత్' (ఇస్లామిక్ చట్టం)లో ఏ మార్పులు ఉండవని' కాంగ్రెస్‌వాళ్ళు అంటున్నారు. ఇది నిజమా?

**జ :** మీరు రెండు ప్రశ్నలు అడిగారు. వాటిలో మీ మొదటి ప్రశ్నను ఇందిరాగాంధీని అడగడమే సరైనదనుకుంటాను. రెండోది ముస్లిం ఓటు 'సముదాయానికి' సంబంధించినది. అది నిజమే.'ముస్లిం చట్టంలో మార్పులేవీ ప్రస్తుతం చేయం' అని కాంగ్రెస్ వాళ్ళు అంటున్నారు. 'ముస్లిం చట్టం', 'ప్రస్తుతం' అనేవి కాంగ్రెస్ వాడే కీలకమయిన పదబంధాలు. భారతదేశంలోని ముస్లింలకున్న ముస్లిం చట్టం షరీయత్ కాదు. ఒక్క సౌదీ అరేబియాలో తప్పా మరెక్కడా షరీయత్ అమల్లో లేదు. 'ప్రస్తుతం చట్టం చేయట్లేదు' అనే దాన్ని నేను, 'సమయం వచ్చినప్పుడు చేస్తాం' గా భావిస్తున్నాను.

**ప్ర :** దిలీప్‌కుమార్ పటానేకర్ (చిప్లున్) : హమీద్‌భాయ్, ముస్లింలీగ్ అనేది ముస్లింలకు వరమా, శాపమా?

**జ :** అది శాపం! ముస్లింలకి మాత్రమేకాదు, హిందువులకి కూడా. మొత్తం దేశానికే అదొక శాపమని నా భావన.

**ప్ర :** సుభోధ్ వి. ధార్వాల్ (ఖేడ్, రత్నగిరి) : ఇస్లాం ప్రజాస్వామ్యాన్ని, సమతా భావనను పెంపొందించే మతం, మీ అభిప్రాయమేమిటి?

**జ :** ఏ మతమూ కూడా సమానత్వాన్ని, ప్రజాస్వామ్యాన్ని చెప్పవు. ఇస్లాం కూడా దీనికి అతీతం కాదు. ఆధ్యాత్మికత ఆధారంగా మతాలు సమాజాన్ని నిర్మించడానికి చూస్తాయి. అవి మధ్య యుగాలనాటి భావాలు. ప్రజాస్వామ్య భావన, సమానత్వ సాధన, సౌహార్ద్ర వైఖరి ఆధునిక దృక్పథాలు. మతం అనేది సమాజంలోని సాంస్కృతిక వికాసానికి పనికిరాదనే విషయం మనమంతా అర్థం చేసుకోవాలి.

**ప్ర :** దిగంబర్ పాఠక్ (అమరావతి) : మీరు ప్రతిసారీ హిందూ, ముస్లిం ఐక్యత కోసం, మత సమైక్యత కోసం మాట్లాడతారు, రాస్తారు. కానీ, ఈనాటి విద్యావంతులైన ముస్లింలు భారతదేశాన్ని ప్రేమించడానికి సిద్ధంగా లేరనడానికి అనేక ఉదంతాలు ఉన్నాయి. దీనిపై మీ అభిప్రాయం ఏమిటి?

**జ :** దీనిపై నేను ఏ అభిప్రాయం చెప్పాలి? ముస్లిం విద్యాధికులు భారతదేశాన్ని ప్రేమించడం లేదనడానికి వివిధ ఉదంతాలు చెబుతున్నారు. మీరేమో నా అభిప్రాయం పై మళ్ళీ నా అభిప్రాయాన్నే చెప్పమని అడుగుతున్నారు! ఈ ప్రశ్నకు సంబంధించిన మీ ఉదార స్వభావానికీ, దయార్ద్ర హృదయానికి మీకు నోబెల్ బహుమతి ఇవ్వాలి.

**ప్ర :** క్షమా తవాడే (ముంబయి) : కుటుంబ నియంత్రణకి ముస్లింలు వ్యతిరేకం, ఇది దేశద్రోహం కాదా?

జ : మతవాద ముస్లింలు, కేథలిక్కులు, కొంతమంది జనసంఘ్ నేతలు, ఆరెస్సస్, పూరీ శంకరాచార్యులు, ఆచార్య వినోబా భావే వీరంతా కుటుంబ నియంత్రణ భావనకు వ్యతిరేకమే. కాబట్టి, వీళ్ళందరూ దేశద్రోహులే అంటారా?

కోట్లాదిమంది ఆర్థికాభివృద్ధి కోసం రూపొందించబడే ప్రణాళికల్లో అందరూ భాగస్వాములు కావాలి. కుటుంబ నియంత్రణ అనేది వాటిల్లో ఒకటి. అది కఠినంగా అమలుచేయాలి. దాంతోబాటే, ఉత్పత్తి రహిత గోపశువుల సంఖ్య ఏదయితే ఉందో, వ్యవసాయరంగ నిపుణులు చెప్పేదేమంటే అది 30% కి తగ్గించబడాలి. అలాంటప్పుడు గోవధ నిషేధించబడటం అనేది కూడా మన దేశాభివృద్ధికి అడ్డంకని మీరు భావించడం లేదా?

**ప్ర :** వినోద్ వి. తాంబ్రే (నాసిక్) : బంగ్లాదేశ్‌లోని ప్రస్తుత పరిస్థితి గురించి మీరేమంటారు?

**జ :** ఎంతో హింసను చవిచూసిన 'బంగ్లాదేశ్‌కి ఇప్పుడే స్వాతంత్ర్యం ఇవ్వబడింది. అందుకే ప్రస్తుత వాతావరణం అస్థిరంగా ఉంది. ఆర్థికాభివృద్ధి త్వరితగతిన లేదు. నెమ్మదిగానైనా, సుస్థిరంగా ఆ దేశం రాజకీయంగా నిలదొక్కుకుని భారతదేశంతో సత్సంబంధాలు నెరపుతుందనేదే నా ఆకాంక్ష.

**ప్ర :** శ్యామంత్ కులకర్ణి (మాలెగావ్) : మీరు హిందూ మతంలోకి మారడాన్ని ఇష్టపడతారా?

జ : మొహమ్మద్ సామి కాంట్రాక్టర్‌గారికి ఇచ్చిన నా జవాబుపై మిమ్మల్ని దృష్టి సారించవలసిందిగా కోరుతున్నాను. పుట్టుకరీత్యా నేను ముస్లింని, పరంపర రీత్యా నేను హిందూని. హిందువుగానో, ముస్లింగానో మారేకంటే ఒక మంచి మనిషిగా మనగలగడం ముఖ్యమని నేను భావిస్తాను. ఎందుకంటే, ఇప్పుడు మతం అనేది కాలం తెరవెనక్కి వెళ్ళిపోతుంది.

కాబట్టి, శ్యామంతరావుగారూ, ఈ కాలంలో నన్నో మనిషిగానే ఉండనివ్వండి. ఈ హిందూ – ముస్లిం తగాదాల్లోకి నన్ను లాగకండి.

**ప్ర :** సులభ భకారే (అమరావతి) : మీరు మీ ఈ కార్యాచరణలో అనేక అవమానాలు, బాధలు, అసంతృప్తులు అనుభవించారు. అలాంటి సమయంలో ఏ మనిషికైనా ఒక భరోసాని ఇచ్చే వ్యవస్థ ఏది?

**జ :** నేను ఎన్నడూ అలా ఆలోచించలేదు. ఇది మంచి ఆలోచన, కచ్చితంగా దీనిని గురించి ఆలోచిస్తాను.

**ప్ర :** అనీల్ ఛనాకేల్కర్ : మధ్యతరగతి బుద్ధిజీవులు తక్కువగా ఉన్న ముస్లిం సమాజంలో మేధో వికాసం అనేది చాలా కష్టమైన విషయం. సామాజిక అభివృద్ధి కోసం మార్పు కోసం మీరు అనుసరించే మార్గాలు, పద్ధతులు ఏమిటి?

**జ :** మేధోసామర్థ్యం గల బుద్ధిజీవుల్ని మలచడమే 'ముస్లిం సత్యశోధక్ మండలి' యొక్క ప్రధాన కార్యక్రమం.

**ప్ర :** గణేశ్ పరశురామ్ భావర్కర్ (దోనెవాడె) : మీరు ఎన్నడైనా ఈ విధమయిన కొత్త, విప్లవాత్మక మార్పు గురించిన భావాల్ని మౌల్వీలు, ముల్లాల ఎదుట వ్యక్తపర్చినప్పుడు భయపడ్డారా?

**జ :** అలా భయంతో పనిచేసి, పని చేయడానికి భయపడుతున్నానని మీరనుకుంటున్నారా?